శ్రీ

# దీనావనశతకము




కర్త

పామర్తి బుచ్చిరాజు





సిద్ధార్థినామ సం॥ర మార్గశిరమాసము.

**1919**





సిటీప్రెస్, కాకినాడ.

అంచెకూలి గాక వెల రు 0-3-6.

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

# విషయప్రశంస



అభినవకవిశ్రేష్ఠులలో నెల్ల భక్తిరసము వెల్లివిరియునట్లుగ వ్రాసి తమ ధ్రువవిజయము మున్నగు నాటకరాజములచే జనుల నానందింప జేయుచున్న పామర్తి బుచ్చిరాజుగారు పిన్నవయసునుండియు మృదుమధుర శైలిని గద్య పద్యగ్రంథముల వ్రాయుచుండిరని యందరకును దెలిసిన విషయమే. వీరిభక్తి నితరులకు ప్రసాదించుటకై వీరు కాకినాడజగన్నాథపురమున గల "యువజ నానందసంఘము"న కీమధ్య చేయూతరై వారిచే దమనాటకముల ప్రదర్శింప జేయుటవలన పలువుర కృతజ్ఞతకు వీరు పాత్రులగుచున్నారు. తత్సంఘమునకు నన్ను అధ్యక్షునిగా నుండ గోరి నాకును భగవద్భక్తియు మానవసేవయు వృద్ధి బొందుటకై బుచ్చిరాజుగారు తోడ్పడుటచే నేనును వీరికి కృతజ్ఞుడ. వీరిమధ్య నాకీదీనావనశతకమును మాయింట జదివి వినిపించినదాదిగా నిందలివివేకబోధనామృతము నితరులు గ్రోలి యానందింపజేయ కోరిక నాకు మిక్కుటమై దీని నచ్చొత్తింప గోరితిని. ఈశతకమునగల ప్రతిపద్యమును గూడ మనుజులకు నాద్యంతము తమస్థితి దెల్పి భవబంధవిముక్తికి హేతువగుచున్నదన నతిశయోక్తి గాదు. భక్తిబోధావిశేషముచేతను ఐహికసుఖములు తుదకు దుఃఖహేతువులని కరతలామలకముగ దెలియ జెప్పుటచేతను దీనావనుడగు పరమేశ్వరునియెడ నలయుభక్తికి తోడ్పడుటచేతను జాతిమత భేదములయెడ దురభిమానము దొలగించి యీశ్వరారాధన బలపరుచుటచేతను ప్రతివారును పఠించ దగినదై యున్నందున దీనిప్రాశస్త్యము నెల్లరు నొకప్పుడు గాకపోయిన మరొకప్పుడైనను దెలిసికొని దీనిలాభమును బొందుదురని నమ్ముచున్నాను.

జగన్నాథపురము,
8-12-1919.

వప్పలూరి సీతారామస్వామి.
(న్యాయవాది

# పీఠిక.



ఆర్యవర్యులారా!

నేర మొనర్చినవారికి అధికారి నేరము ననుసరించి సాక్ష్యానంతరము శిక్ష విధింపు చున్నాడు. ఆ శిక్షలు దినములు, మాసములు, వత్సరములు ఆజన్మపర్యంతము ద్వీపాంతరవాసము నై యున్నవి. శిక్షాగారముల కలవాటుపడిన శిక్షాపాత్రులు తమతమబుద్ధులం బోలంగి యుండే సుఖ మని భ్రమ నొందు చున్నారు. అవిధముగనె జీవి పూర్వకర్మానుసారముగం బశుపక్షికీటకక్రిమిసముదాయమున జనని జనించి జ్ఞానము తోరంగి యీయనిత్యసుఖమున మగ్న మగుచు ననంతముగం బుట్టుచు గిట్టు చున్నది. పెక్కండ్లు మనినవారి మన మెక్కుడువానిగ లెక్కించు చున్నాము కాని ద్వీపాంతరవాసశిక్షాపాత్రులవలె నధికపూర్వకర్మాచరణులని యించుకయుం దలంపము. "మహీ వృక్షం బగుసర్వదేహములు" అనువాక్యము దీనం బురస్కరించి వ్రాసినదియు. కొదువపడియుంటలు గుణగ్రహణపారీణులకే కే లోడ్చి విడిచితి.

ఇట్లు,

బుధవిధేయుండు,

ఎం ను రి బు సి రాజు.



శ్రీ

శ్రీకృష్ణార్పణమస్తు.

# దీనావనశతకము.



శ్రీదా! భక్తజనానుమోదఫలదా! శ్రీజ్ఞానమానందసం | వేదీ! నిత్యసుఖప్రసాద! వరదా! విద్వల్లతా
దోహదా! | రాదా నీదయ నాపయిన్ బుధమనోరంగప్రకాశప్రదా! | వాదా లేదిక నాకు వేలుగతి
దేవా! దేవ! దీనావనా!

మ. తలిఁదండ్రుల్ విషయేచ్ఛనో సుఖదసంతానేచ్ఛనో కూడ వా
రలశోణంబును శుక్లముం గలిపి గర్భంబందుఁ బిండాకృతిన్
నిలుచున్ మర్త్యులరూపుఁ దాల్ప ననుచున్ నే నిందు నాయాకృతిన్
గలిగింపన్ వల దంచు వేఁడుదును దీక్షన్ దేవ! దీనావనా!

మ. నెల లే వంతము నొందరాఁగ ననువుల్ నెమ్మేనఁ బల్మాఱు వ్యా
కులముం బొందుచు సన్నుతింపుచు నినున్ గూపస్థమండూకముం
బలె మాతృోదరకోశమధ్యము జలావస్థన్ బడన్ జేయఁగా
వల దంచున్ బ్రణుతించి వేఁడుదును దేవా! దేవ! దీనావనా!

మ. తలయుం జేతులు మధ్యమొయవులు పాదద్వంద్వమున్ జాపఁగా
స్థలముం జాలనిమాతృగర్భమున సూక్ష్మం బైనపార్శ్వంబునన్
మలమూత్రంబుల నిండుకోశమున నన్ ముస్సుం బొనర్పంగఁబో
వల దంచున్ బ్రణుతించి వేఁడుదును దేవా! దేవ! దీనావనా!

శా. మానిందుగ్రింబలె శీర్షపార్శ్వములు క్రిమ్మం జాచుకై మోడ్పుతో
ధ్యానంబున్ గమనించుమాడ్కిఁ దల క్రిం ద్రై యుండి కన్ మోడ్పుతో
హీనద్వారము నుండి కంపుమెయితో నీక్షింపఁ బడన్ జేసి య
జ్ఞానాలాపు నొనర్ప కోవిబుధపక్షా! దేవ! దీనావనా !

మ. పరుపో చాపయొ మంచమో మహియొ దివ్యస్థానమో చిన్నచ
ప్పరమో మంచియొ చెడ్డయో సుఖదమో బాధాకరంబో యిటన్
జెలివారో తనవారో నేరమిని గల్పింపన్ నరాకారమున్
దెరలింపన్ వినుతింతు నిన్ సతము భక్తిన్ దేవ! దీనావనా !

శా. చేదో స్వాదొ ఫలంబొ మోహఫలమో క్షీరంబొ నీరంబొ దా
పో దవ్వో పురుషుండొ స్త్రీయొ పనియో యూరో యెదో నేగమిన్
హ్లాదం బందెదఁ గాని పెంపుఁ గొనుమాయాదేహసంపత్తికిన్
ఖేదం బందెదఁ గల్గఁ జేయ కది రక్తిన్ దేవ! దీనావనా !

శా. లాలిం బెట్టి ప్రివాళహస్తముల మెల్లన్ మెల్లనన్ మెల్లనన్
డోలాయంబుగ నూఁపి యూఁపి కలకంఠుల్ కర్ణపూరంబు గా
జోలల్ పాడుచుఁ బట్టిబొజ్జపయినిన్ జో కొట్ట మత్తుం గనన్
వాలాయం బొనరింపఁ బోకు నను దేవా! దేవ! దీనావనా !

శా. పాదాంగుష్ఠముఁ జీకు చుండెడుశిశుప్రాయున్ ననున్ మానవుల్
దా దా యంచును జప్పటుల్ చఱచి విస్తారభ్రమన్ గూర్పఁగా
మోదం బొందుచు మిట్టి మిట్టిపడుచున్ మోహాంతరంగంబునన్
బోద్రిం బొత్తుల నుండఁ జేయకు స్వయంభూ! దేవ! దీనావనా !

మ. నడుమున్ లేవని ప్రక్క కొత్తిగిల నైవన్ లేని కందూతి పో
నొడలన్ గోకుకొనంగ లేనిశిశు నై యుండన్ శరీరంబునన్
జిడుముం గజ్జె వ్రణంబులుం గురుపులుం జీకాకుఁ జెందం గడున్
గొడమన్ జేయుచు బాధపెట్టకు స్వయంభూ! దేవ! దీనావనా !

మ. పలుకుల్ రామిఁ గదా శరీరమున నాపాదోత్తమాంగంబు దో
మలునున్ నల్లులుఁ బేలునుం గడుఁగడుం బాధించెడుం బొట్ట నాఁ
కలినో కాకనొ నొప్పి పుట్టె నని వక్కాణింప లే నట్టిదు
ర్బలదుఃఖాంబుధి మున్గఁ జేయకుము దేవా! దేవ! దీనావనా!

మ. కలలో గాలియొ ధూళియో సలుపులో కా కేమియో యింతయున్
దెలియం జాలక తెల్పఁ జాల కతిభీతిన్ దల్లియుం దండ్రియున్
గలఁతం జెంది విచార మొంది యుడలం గంగింపఁ బో ర్వెట్టుచున్
వలవంతన్ మునుఁగంగఁ జేయకుము దేవా! దేవ! దీనావనా!

శా. కట్టా! మూత్రపురీషముల్ విడిచి ప్రక్కన్ హేయమున్ జేసి య
ట్టిట్టాడున్ బొరలున్ దదంకమున నే హేయంబు గా నింకఁ జేఁ
బట్టున్ బుల్కకొనున్ ముఖంబునఁ బయిం బై నోట నాహస్తమే
పెట్టున్ బెట్టకు మట్టిశైశవపుఁబ్రాప్తిన్ దేవ! దీనావనా!

శా. వాదే నా శయొ! పెట్టు చుంటి విట విన్నాణంబుగా శైశవ
ప్రాదుర్భావమువాది ప్రాగ్భవసకర్మన్ దానిఁ దప్పించుకోఁ
గా దేదేహికి నైన దేహి యగుటే కర్మప్రభావంబు నా
యాదాయం బది యౌను వెండియు ననంతా! దేవ! దీనావనా!

శా. శైశోరాంచితకోకిలస్వరమునన్ గర్ణప్రమోదంబు గా
నాశాశార్ణవవీచి నూఁచు మృదులావ్యక్తోక్తులన్ బల్కఁగా
శేశం బేమర కక్షిపక్షములమాడ్కిన్ బ్రోచి ప్రాపించదు
ష్పాశపాత్రకటబద్ధుఁ జేయ వల దీశా! దేవ! దీనావనా!

మ. కుడువన్ గ్రోలఁగ నంతఁగా నెఱుఁగకే కూర్చుండుచున్ బ్రాఁకుచున్
నడువన్ జూచుచు లేచుచుం బడుచు బన్నా లెన్నొ ముం దిట్టులే
గడువన్ గా వలె నైహికంబు లనుతారుణ్యవ్యధావస్థ నా
కొడఁ గూర్పన్ వల దంచు వేఁడుదు స్వయంభూ! దేవ! దీనావనా!

శా. మోదం బూడఁగ ద్వంద్వదూరుఁడును విజ్ఞుండున్ గడున్ నగ్నుఁడున్
వ్రీడాహీనుఁడు నాఁగ నుండిన వయోవృద్ధిన్ మనోల్లాసి యై
యాడం బాడను నేర్చి యుండును గదా యజ్ఞుండు నై యట్టి డా
క్రీడాసక్తు నొనర్పఁ బోకు నను రక్తిన్ దేవ! దీనావనా !

శా. తోడం గూడెడియాడువారలఁ గష్టం దూషించి బాధించి వే
యూహంబాడుచుఁ గీటకక్రిమివధోద్యోగంబుఁ గావింపుచున్
పాడిన్ వీడి చరింపుచున్ గరము సవ్యక్తోరుదోషాబ్ధిఁ దూఁ
గాడన్ జేయకు మొఱకుఱ్ఱడున్ సతము దేవా! దేవ! దీనావనా !

మ. క్షరమే కూర్చిన నేది యైన నను విజ్ఞానంబునన్ మాతయున్
గురుఁడున్ సాకరు దూర మాగయుచు యోగ్యున్ జ్ఞానిఁ గాఁ గోరి య
క్షరముల్ నేర్పుదు రోనమాలు మును గా సర్వంబు, వేగం బె య
క్షరలభ్యం బొనరింపవే విబుధపక్షా! దేవ! దీనావనా !

మ. సరవిన్ లౌకికవృత్తి నేర్పగురుఁడున్ శాస్త్రంబు లేలా స్థిరా
క్షరలభ్యున్ భవపాశనాశను నిరాకారున్ సుఖున్ జేయుస
ద్గురుఁ డీ వంట నిజంబెఱుంగ హృదిఁ గోర్కుల్ పుట్టఁగానన్ దయన్
ద్వర నన్ జేర్పుము నీదుసన్నిధికి దేవా! దేవ! దీనావనా !

మ. వడిగాఁ బుత్తడి యిత్తడిన్ మఱియు భాస్వద్వస్తుభేదం బెఱిం
గెడిజ్ఞానం బొడఁ గూర్చి కూర్చుతలఁపుల్ గీల్కొల్పి ప్రేరించి యీ
సడ యిం తేనియు లేక పెల్లుఁగొను నాశాపాశజాలంబునన్
ముడి వెట్టన్ వల దంచు వేఁడుదు స్వయంభూ! దేవ! దీనావనా !

శా. జేగీయంబులుఁ జిత్తహర్షములు నౌచీనాంబరంబుల్ నగల్
భోగింపం దగుభర్మహర్మ్యములు పాన్పుల్ తోఁటలున్ గూర్పఁగా
రాగంబుం గలిగించి పెంచుచు విచారగ్రస్తచేతున్ మనో
రోగిన్ జేయకు పట్టి కొల్తు భవదంఘ్రుల్ దేవ! దీనావనా !

మ. జ్వరమో వాతమొ దగ్గొ మేహమొ శిరోపార్శ్వవ్యథో యుబ్బొ రొ
న్నిరుజల్ లే వికఁ దేహమం దొకటై జన్మింపన్ వ్యథన్ బెట్టఁగన్
సరగన్ శాంతి నొసంగుని న్మఱచి యజ్ఞానంబునన్ దల్లినిన్
స్మరియింపన్ మదిఁ బుట్టు నీయకుమ యీశా! దేవ! దీనావనా!

మ. తలిదండ్రుల్ తనమూఢకృత్యములకున్ దండింప బాలుండు వా
రలకాళ్లే శరణంబు గాఁ బెనఁగి నైర్మల్యంబు సాధించున
ట్టులు కర్మానుభవాప్తకష్టములు వే దుల్లంగ నీయంఘ్రులే
కొలుతున్ నిర్వృతి నిమ్ము సత్వరము నాకున్ దేవ! దీనావనా!

శా. కన్నో కాలో కరంబొ నోరొ చెవియో కాయంబునన్ లేమి ని
న్నెన్నో రీతుల నింత యేమఱకయే యాక్షింపఁగాఁ బోవఁగాఁ
గ్రన్నన్ జేయఁగఁ బల్కఁగా వినఁగఁ దాఁ బ్రార్థింపఁడే యట్టియా
పన్నున్ బ్రోవఁగ నీవ లే రొరులు దేవా! దేవ! దీనావనా!

శా. సందుల్ గొందులు తూఱి తిమ్మరుచు నీచత్వంబుఁ బాటింపకే
పందుల్ మోదము పొందునట్లు కడుపుం బ్రాల్మాలి నిండింపు చా
నందంబుం బశుహీనమానవులతో నన్నొక్కనిం జేయకే
వందారుల్ పదివే లొనర్చెదను దేవా! దేవ! దీనావనా!

మ. చదువున్ సంధ్యయు లేక పైఁబయిని వేషంబుల్ కడుం దాల్చుచున్
ముదముం బొందుచుఁ గండలం బెనుచుచున్ మోహాంతరంగంబునన్
బదముల్ పాడుచు నాడుచుం దుముకుచుం బ్రాల్మాలి జీవింప న
న్నదయన్ జేయకు వేఁడువాఁడ సత వీశా! దేవ! దీనావనా!

మ. పదముల్ పట్టుచుఁ జిత్తమం చొరులచెంపన్ జేరి యర్థించి మేల్
పదవిం బొందుచు మన్న మి న్నెఱుఁగకే వ్యర్థైహికభ్రాంతులన్
బొదలన్ విత్తముఁ గూడఁ బెట్టుతలఁపుల్ పుట్టించుదుర్విద్య నా
కొదవన్ జేయకు వేఁడెదన్ నిను స్వయంభూ! దేవ! దీనావనా!

మ. చదువున్ మూఁడవకన్నుగాఁ బలుకరే శాస్త్రప్రవీణుల్ సదా
యది జ్ఞానేంద్రియ మంట సంశయమ? స్థూలాక్షిన్ గనన్ రానిదిన్
మదముం గాంచఁగఁ జూపి మోహనిధనంబున్ జేయదే యట్టిప్రాఁ
జదువే నా కొనఁ గూర్పవే విబుధపక్షా! దేవ! దీనావనా !

మ. తలుపోరన్ దలవాకిటన్ నిలిచి చిత్రభ్రాంతులై జారిణుల్
తలుకుంబెల్కుల హావభావములఁ జేతంబుల్ కరంగింపఁగాఁ
జిలుకం జిల్కులపల్కులన్ బ్రియమయూచున్ జీకాకుమై స్వాంతమున్
కలఁగన్ జేయకు వేఁడువాఁడ బుధపక్షా! దేవ! దీనావనా !

శా. కాయంపుంబలిమిం గనుంగొనుచునుం గర్వంబునం బేర్చుచున్
హేయంపుంబనులం ద్యజింపక సతీహేరాళరత్యాదిప్రే
మాయావాగురబద్ధవర్తనుఁడు దుర్మార్గుండు నై యుండ నా
ప్రాయంబుం గలిగింప వింక దయ దేవా! దేవ! దీనావనా !

శా. కామోద్రేకము నెత్తికెక్కి కనులం గ్రమ్మంగ విజ్ఞానవి
ద్యామాహాత్మ్యము మాయఁగా నుచితకార్యాలోచనల్ పాయఁగా
వామాక్షీప్రియసంగమప్రచురితవ్యాపారలోలుండు నై
బాముల్ బొందఁగఁ జేయ వద్దు నను దేవా! దేవ! దీనావనా !

శా. మోసంబుల్ మెలిఁ బెట్టు ముష్కరమునన్ మోటున్ సదా గీటు కన్
రోసంబున్ వెలిఁ బెట్టు దుష్కరమునన్ రోగంబులం దోఁగు స
న్న్యాసోద్వాపనమున్ వచించుఁ దనయన్యాయ్యప్రవర్తంబునన్
దాసోహమ్ములజవ్వనమ్మున కనంతా! దేవ! దీనావనా !

మ. అరిషడ్వర్గములన్ మునింగి విషయవ్యాపారపారీణులై
పరమున్ జింతయొ సేయ కెల్లపుడునుం బ్రాపించి కాకృత్యత
త్పరులై యుండుద్విపాదజంతువులమధ్యన్ నన్నునుం గల్పకో
పరమాత్మా! కరుణామయా! వరద! దేవా! దేవ! దీనావనా !

మ. కుహనాసంస్కృతభూరివారినిధిమగ్నుం జేసి కాలవ్యథా
లహరీభంగచయాంతరంబునను నల్లాడింపుచున్ సర్వదా
యిహలోకప్రతిబంధకంబులను నెన్నేఁ గూర్పుకన్యాకర
గ్రహణేచ్ఛన్ గలిగింప కింక బుధపక్షా! దేవ! దీనావనా !

శా. సంసారాంబునిధిన్ దరించుట కడున్ శక్యంబె యజ్ఞానికిన్
హింసోద్యోగసమస్తరోగగురుమత్స్యోందాద్రిపూరంబు వి
ధ్వంసాకారవికారకష్టశతకవారితోగుభంగానృతం
బుం సంరావ మపార మయ్యది స్వయంభూ! దేవ! దీనావనా !

మ. అభయంబున్ వగలున్ మృషల్ చొరవ యొయ్యారంబులున్ టక్కులున్
వ్యభిచారంబు విచారహీనతయు గర్వంబున్ దురాభావమున్
రభసంబున్ జపలత్వమున్ బ్రబలనిర్లజ్యంబునున్ గల్గుభా
ర్య భరింపన్ మెడఁ గట్టి వేఁపకుమ దేవా! దేవ! దీనావనా!

శా. ఆలుం గట్టి జనింప నీకు మది గయ్యాళో కురూపో వనుం
గీలుంబొమ్మను జేయనాఁడుదియొ యేకీభావముం బూవ కే
వేళం ధిక్కరణం బొనర్చునదియో స్వేచ్ఛావిహారక్రియా
లోలస్వాంతయొ యన్విచారవిషవల్లుల్ దేవ! దీనావనా !

శా. చీరల్ లే వని యొక్కవేళ అవికల్ చేకూర్ప నొక్కప్పుడున్
హారంబుల్ ధరియింప నొక్కతరి నాహారార్థసంభారముల్
లే వేమీ యని యొక్కమాఱుఁ దనమూతిన్ ముడ్చి వేగించుఁద
న్నారీశృంఖలబంధ మేల వల దన్నా! దేవ! దీనావనా !

శా. అంతా సంశయమే విషాదకరమే యంతాదురాగ్రహ్యమే
యంతా మాయయె యంతయున్ భయదమే యంతా భరంబే సతం
బంతా లోపమె యంతయుం దురితమే యంతా నిమేషంబె యా
కాంతాసంగమ మేల చాలు బుధపక్షా! దేవ! దీనావనా !

మ. చినమోమున్ జిఱునల్లవెండ్రుకతలన్ జెల్వాఁచెవుల్ కంజలో
చనముల్ చక్కనిచెక్కిళుల్ గలప్రతిచ్ఛాయన్ గనం జాలమిన్
వెనుకన్ వచ్చెడుసంకటంబులను గన్పెట్టంగ లే కజ్ఞుఁడై
యనపత్యుండ నటంచుఁ జొక్కెడిని దేవా! దేవ! దీనావనా!

శా. ఎంతోచింతకు మూల మన్నతలఁపే యింతేనియున్ లేక పై
నెంతోసంతస మెంతోవింత సుకరం బెంతోసుఖస్థానమున్
గాంతాసంతతిభాగ్య మంచు భ్రమమైఁ గర్మప్రభావంబునన్
సంతానాతురుఁ జేయఁ బోకు నను నీశా! దేవ! దీనావనా!

మ. గురుసంసారగభీరవారినిధిమగ్నుం జేసి త్వత్పాదసం
స్మరణంబున్ మఱపించి చాల కదియున్ సంతానభంగంబులం
బొరలంజేసి యలంతయున్ గలఁతయున్ బూరించి వేధింపఁగాఁ
దక మానే తరియింప నజ్ఞున కనంతా! దేవ! దీనావనా!

మ. గురుసంసారగభీరవారినిధిమగ్నుం డౌప్రజాశూన్యుఁడే
తెఱలం జాలక యెన్నియోగతుల సంతాపింప సంతానను
స్థిరపాశప్రతిబంధమానవుఁ డీఁకం దేలంగఁ దాఁ జాలునే
త్వరఁ నంతంతకు మున్గుచుండెడిని దేవా! దేవ! దీనావనా!

శా. చాలా లాలని పామరుండు మురియున్, క్షోభిల్లదే పెల్లుగన్
గాలాభీలదయావిహీనమృతి మ్రింగం బొంచి యంతంతకున్
వాలాయంబుగ డాయుచుండె నవుచున్ భావించి జోడింపుచున్
శైలన్ స్వాంతము నీపయిన్ నిలిపి దీక్షన్ దేవ! దీనావనా!

శా. అండం బంతకు నంతకుం బెరిఁగి గర్భాధిక్యతన్ జూప నా
గండం బేది సకాలవృద్ధి జననీకాంక్షల్ ఫలం బొందఁగాఁ
బిండం బుద్భవ మౌనొ లేదొ యనుచున్ వే ల్వోఱుంగా నెప్పుడున్
జండావేదన ముంప ఐద్దు బుధపక్షా! దేవ! దీనావనా!

మ. ఎవియో దుర్ఘటముల్ వచించి యవి యెంతేఁ దీర్పఁగాఁ గోరుచున్
నవమాసంబులు భార్య గర్భవతి నానాక్షోభలం బెట్టుటల్
వివరింపం బ్రసవంబువేళఁ దనజీవిన్ నిల్పుటే కష్టమన్
రవముల్ వైచుట లెంతో వేఁచుఁ గద భర్తన్ దేవ! దీనావనా !

మ. శిశువున్ గాంచియు భర్త యేమిసుఖముం జెందున్ సతీక్షేమ మిం
క శిశుక్షేమము సంతతం బరయుచున్ గన్ గల్గి యాలోచనా
వశతన్ మెల్గ వలెన్ ధనవ్యయమునున్ భావింపకే భార్యయున్
శిశువున్ స్వాస్థ్యముఁ జెందుదాఁకఁ గడు గస్తిన్ దేవ! దీనావనా !

శా. సంచారం బోకయింత లేకయె మెయిన్ జాడ్యంబు క్రమ్మంగఁ దాఁ
గంచం బైనను జేర లేక సతమున్ గష్టంబునన్ రోదనన్
మంచంబే సకలంబు గా మనుసతిం బంధించి లౌక్యంబునన్
ముంచం బోకుము నిన్నె గొల్తును సతంబున్ దేవ! దీనావనా !

శా. పాడిన్ బంటను లేనివాఁ డనుచున్ బంధుల్ విరక్తిం గొనన్
గూడుం గుడ్డయు లేమినిం గొదుకులున్ గూఁతుండ్రు వేధింపఁగాఁ
గాడుం బెట్టుచుఁ దిట్టి నెట్టుచుఁ గడున్ గయ్యాళియా లేడ్వఁ మాఁ
గావం జేయకు పేదసంసృతిని దేవా! దేవ! దీనావనా !

శా. శీలం గల్గినవారికిం గలుగునే చింతింప సౌఖ్యంబు! వా
చాలత్వంబు దురాశ తల్లడము జంఝాటం బసంతృప్తి యే
వే లేదో యనుసంశయాదులు కడున్ వేఁకన్ గ్రసించున్ వృథా
లోలున్ జేయకు నీపదంబులను గొల్తున్ దేవ! దీనావనా !

శా. ప్రాయంబున్ హొయలున్ వినోదములు విక్రాంతుల్ పదార్థంబులున్
గాయంబున్ సుమనోహరంబులును నేఁ గాంక్షించెదన్ జాలఁగా
మాయామోహవికారసంచయతమోమగ్నుండ నై యుండెదన్
బాయం జేయక దూర మారయక దేవా! దేవ ! దీనావనా !

శా. ఆరోహించితి నష్టకష్టములతో నగ్రిస్థలం బింకటన్
సారంబున్ సడలంగఁ జొచ్చె మగుడన్ స్వస్థానముం జేరఁగా
నే రాఁ గా వలెఁ గాని దానఁ గలహానిం గాంచి శంకింతు న
న్నేరీతిన్ దరిఁ జేర్తువో భరము నీదే దేవ! దీనావనా !

మ. ధనముం గూర్పఁగఁ జాలఁ జాల నసుచుం దర్కించి రేయుంబవల్
మనముం దాభగవంతుఁ డింక బలసామర్థ్యంబులం బెట్టఁడే
యని యార్తుం డగుఁ గాని కర్మ నిడుదేహంబున్ దొలంగించు నిం
ధనముం గూర్పఁ దలంపఁ డింత పరమాత్మా! దేవ! దీనావనా !

మ. నరముల్ శక్తిఁ దొలంగు జీవకణముల్ నల్గున్ నిమిత్తంబుగా
నెఱకల్ తెల్పు గ్రహించు నొక్కటొకటే నెమ్మేను గుర్రంగం బడున్
జర యించించుక డాయఁ దెల్పెడిని వర్ఛస్సే భజింతున్ వయః
పరిమాణక్షయ మొక్కసారి యొనరింపన్ దేవ! దీనావనా !

శా. సర్వాంగంబులు నొచ్చు నేది యయినన్ సాధింపఁగాఁ బోయినన్
బర్వున్ బుద్ధి దురాశవెంబడి భయోత్పాతం బగున్ జా వనన్
బర్వం బౌను సతీసుతాదులఁ గనన్ వ్యామోహ మిట్లుండె న
న్నుర్వీబంధమునన్ బిగించితివి యయ్యో! దేవ! దీనావనా !

శా. రూపం బారుచు నుండెఁ గాని పెనుకోర్కుల్ తగ్గ విం తైన లో
దీపం బారుచు నుండెఁ గాని యెదశోఁ దీవ్రంబు పో వింతయున్
బాపం బూరుచు నుండె నింక మదిఁ దాపం బింత క్షీణింప దీ
వ్యాపారం బదు గంటఁ బెట్టు నను దేవా! దేవ! దీనావనా !

మ. స్వరమాధుర్యము పోయెఁ జూపు మసకల్ సంధించెఁ బెందండమున్
గర మర్దించెఁ జలించెఁ బల్లులు నవాంగంబుల్ దడం బట్టె నా
యరుదౌ నోపిక యంతరించె నిఁక స్వాస్థ్యం బేఁగు చుండెన్ జరా
భరమున్ బైఁ బడు చుండెఁ గావు మనుకంపన్ దేవ! దీనావనా !

శా. అందం బంతము నొందె యౌవనజనాహ్వానంబు పోయెన్ గడున్
మందం బయ్యె నడల్ నుడుల్ పొరలు క్రమ్మెన్ దృష్టియుం బోయె నా
నందం బేఁగెను బండ్లు రాలె ధృతి సన్నం బయ్యె ధీ మాసె నా
బొందిం బ్రాణమె నిల్చి యుండెను స్వయంభూ! దేవ! దీనావనా !

శా. క్రుంగెన్ దేహము వంగె వెన్నడుము చెక్కుల్ లోఁతుగాఁ బోవు స
ర్వాంగంబుల్ ముడుతల్ వడెన్ జెవుడు హెచ్చయ్యెన్ శరీరంబు కం
పుం గొట్టున్ నిదు రావహించె మఱపుం బుట్టెన్ ధరాభార మై
యింగాలంబె వరింప నుంటి సమవర్తీ! దేవ! దీనావనా !

శా. వృద్ధాప్యంబు ద్వితీయబాల్య మొకొ! యావెం పేది? సొం పేది? సం
బద్ధాంబాప్రితిమానవమోహా మెది? సర్వం బేది హా! హా! ఘన
శ్రద్ధాబద్ధులు కాఁ బాంగవులతోఁ జావున్ నిరీక్షించునా
వృద్ధాప్యంబు ద్వితీయబాల్య మన నొప్పే? దేవ! దీనావనా !

మ. ఒడలం గప్పకొనంగ లేను జన లే నొక్కింత పన్నన్న నా
పడకన్ వీడి యసహ్యకార్యములనున్ వర్జింపఁ బూర్ణంబుగా
సడలన్ శక్తి నొసగ్తు నెంతయు వనాచారంబులన్ సర్వ లీ
పడ సేయన్ విసుగన్ విచాగపడ నిచ్చల్ దేవ! దీనావనా !

శా. అయ్యో! ఱెక్కలు రావు పిల్లలకు మాయాయున్నసున్ దీర వా
గయ్యో! యమ్మ! యటంచుఁ బొక్కెదును దక్షాపేక్షులై యుం చెదల్
వెయ్యాఱుల్ తలపోయుఁ గాని మన కా*విష్ణుశ్రియం బట్టదే
యయ్యో! పాహి! హతోస్మి! యసం చడల వయ్యా! దేవ! దీనావనా!

మ. తరిగెన్ జ్ఞాపకశక్తి యింద్రియపటుత్వంబున్ బటాపంచలై
యరిగెన్ గా జఠరాగ్ని చల్లఁ బడె జిహ్వాన్ వీడి లోఁ బోదు మం
దు రసజ్ఞప్రభ తీరెఁ జుట్టుఁ గలబంధుల్ గొల్లు మం చేడ్వఁగాఁ
దొగఁగున్ జీవి యెటా గెలాగొ మెయిపొత్తున్ దేవ! దీనావనా !

---

*విష్ణుః = (వ్యుత్పత్త్యర్థము) విశ్వవ్యాపకుఁడు.

మ. చనఁగా నూర్ధ్వపథంబులన్ శుభదినస్థానంబులన్ బ్రాణముల్
తనువున్ భూమిఁ దొఱంగి "పుణ్యు మ"నువృత్తాంతంబు నర్థిక్రాలన్
జనుఁ గా కట్టు లధఃపథంబుల జనన్ సర్వాఘతారాక్రమ యా
ననఘాఘాత్మల నంతమే తెలుపు దేవా! దేవ! దీనావనా !

మ. మొదలన్ నాలుగు మధ్య రెండుఁ జివరన్ మూఁడున్ నిరూపింప నా
పదముల్ కల్గినవింతమ ర్త్యమృగ మీవ్య క్తిన్ మృగాధిక్యతన్
బొదలన్ జేయ వివేకవల్లములపెంపున్ గూర్తువే కాని తా
వదలన్ జాలదు నైజమార్గముల దేవా! దేవ! దీనావనా !

శా. నాల్గున్ మూఁడుపదంబులన్ మనుచు విజ్ఞానంబునం జాలఁగా
వెల్గున్ రెండుపదంబులన్ మనెడునవ్వేళన్ స్వతంత్రంబునన్
కల్గున్ గాదె పునర్భవంబు లొదవం గా బాధలం బొందఁ గా
నీల్గం గా నగుదుష్టబుద్ధు లిఁక నే నెన్నే దేవ! దీనావనా !

శా. కన్నుల్ దూషిక లొద్వుఁ గర్ణములనో కాన్పించెడున్ గుల్మి ము
క్కన్నన్ జీమిడిఁ గార్చు నూర్చు నుమి నో రయ్యో! యధోరంధ్రముల్
క్రిన్నన్ మూత్రపురీషముల్ విడుచు నారంధ్రప్రవృత్తం బిదే
నన్నే నే నెఱుఁగన్ విచార మగు మిన్నన్ దేవ! దీనావనా !

మ. నవరంధ్రంబులతో లుబొమ్మ యిఁక నానాహేయభూయిష్ఠవ
స్తువిము క్తపరిచరంబు మాంసభరమున్ శోణపరిపూర్ణంబు సం
స్రవనీయం బెటు లౌనో యియ్యది నిమేషంబున్ భయభ్రాంతశ
ప్రవిచారావహ మౌచు నుండఁగ ననంతా! దేవ! దీనావనా !

శా. నిత్యంబున్ దనలోన హేయములు జన్మింపన్ దలంపోయకే
ప్రత్యక్షీక్షితబాహ్యహేయములఁ దల్పం జాలకే సంతతా
నిత్యాసహ్యశగప్రపంచమున జన్మింపంగఁ జావంగఁ దా
నత్యంతంబు సహించుఁ దన్మయమునన్ హా! దేవ! దీనావనా!

మ. అతిగర్హ్యాంబులె కాన స్త్రీపురుషచిహ్నాంబుల్ పటాద్యాళితో
సత మాచ్ఛాదన మొందఁ జేయ వలసెన్ సర్వేతరాదృష్టికై
క్షితివృత్తం బిటు లుండఁగా నెటులు కాంక్షించున్ వసించున్ గటా!
మతిమంతుండు సలజ్జ మగ్నుఁ డయికర్మన్ దేవ! దీనావనా!

మ. అతిహేయంబులు చూడ స్త్రీపురుషచిహ్నాంబుల్ పరీక్షింపఁగా
నతిహేయంబులు చూచె స్త్రీపురుషచిహ్నస్రావముల్ చూడఁ ద
ద్రతికార్యం బతిహేయమే యగును దద్రత్యానుకూలప్రస
న్నతనూత్పత్తియు హేయమే మఱియు నెన్నన్ దేవ! దీనావనా!

మ. వెలిరై యింద్రియముల్ గ్రహించుటఁ గదా పీడంబడున్ హేయముల్
కలస్థానంబులు నట్లె తత్త్వము సమగ్రగ్రాహ్యముం జేయుచున్
వెలిరై యింద్రియనిగ్రహం బొనరుపన్ పీడం బడున్ గాయమున్
దొలి తాఁ జేసినకర్మయున్ బుడమిపాత్రున్ దేవ! దీనావనా!

మ. అదియున్ లే దిది లేదు లే దిఁకఁ బిదో యంచున్ విచారంబునన్
సదసద్బుద్ధి నశింపఁ జేసికొనుచున్ సంసారతాపత్రయం
బొదవన్ ద్వత్పదసేవనే మఱచి సర్వోత్కృష్టధీమార్గమున్
వెదుకన్ జేయకు చేయుమీ భవసమాప్తిన్ దేవ! దీనావనా!

మ. తనువో బుద్బుదసామ్య మయ్యది నితాంతప్రక్రియన్ నైజరీ
తిని ధాత్రిన్ క్షణికంబె యయ్యు సత మాదిన్ బెట్టి యున్నట్టిపే
రనె నర్తించెడు సంసృతీర్యుఁగను నిస్త్రాణన్ సతం బూఁగు చుం
డును బ్రాజ్ఞుం డెటు దాని నమ్మకొని యుండున్ దేవ దీనావనా!

శా. గాలంపుంగొనఁ గూర్చి యున్నయెఱ భక్ష్యం బంచు మత్స్యం బయో!
వాలాయంబుగ మ్రింగుఁ గాని యది తన్ భక్షింప ధీమంతుఁ డా
లీలన్ జూపెడుఁ బొంచి యం చెఱుఁగ దాలీలన్ జనున్ మర్త్యుఁడున్
గాలాయుక్తవిమోహనప్రకృతి మ్రింగన్ దేవ! దీనావనా!

మ. అడఁగింపన్ గల నంబుధారలను స్వాహావల్లభున్ గాని యె
ట్లుడిగింపన్ గల నంబుపూరములనే యుత్పత్తి రైయేఁగునా
బడబాగ్నిన్ బహిరారి నట్టులె యడంపన్ జాలుదున్ గాని లోఁ
గలషడ్వర్గ మడంప నన్యము నెఱుంగన్ దేవ! దీనావనా !

శా. అంతా నీదగురూపమే భవదగాధాపారవైవర్ణ్యమూ
లాంతర్భూతము లైనజీవనము లాయాకర్మసాక్షిప్రసా
రాంతర్వ్యాప్తుల వేఱఁ బుట్టి మనుదున్ హా! యెన్నివేలేండ్లు నీ
వంతం బిచ్చ్యక యిట్లు త్రిప్పెదు వనంతా! దేవ! దీనావనా !

శా. క్రిస్నన్ బ్రిక్కలఁ గూడుజీవనములం గా జీవనం బేర్పడున్
గొన్నా శ్లేకత మెంతొ వింత నడుచుం గుత్తంబుగా నద్దిపై
మున్నేర్పడ్డవిధాన శాఖలతతిం బొల్పొందుచున్ గూడెడిన్
క్రిస్నన్ జీవనపూర్ణ జీవనది నాఁగా దేవ! దీనావనా !

మ. అనిలాంతర్గతసూక్ష్మజీవతతిహింసాకార్యకర్మంబునై
ననిలాహారపరాయణుండె యఘసంహారుండు కాకుండఁగా
ననిశంబున్ రుచు లౌపదార్థములనే యాశింపుచున్ మెక్కునే
ఘనపాపుండను గానె యే లునిచె దింకన్ దేవ! దీనావనా !

శా. చయ్యన్ సృష్టినిమిత్తమాత్రి మనుపంచత్వంబు నూహింప కే
యయ్యో! యుత్తమమధ్యమాధమఫలాహారాదులన్ జిహ్వకున్
దియ్యంగా రుచిగాఁ జెలంగుఫలముస్త్రిషట్కండజాహార మ
న్యాయ్యం బంచుఁ దలంపకే మెసవు దేవా! దేవ! దీనావనా !

మ. తనమిత్రిక్రిమిభుక్తికారణమునన్ దా నిల్చి పొల్చుం గదా
కన సూక్ష్మక్రిమిసంకులం బయినయీకాయంబు సర్వత్ర యీ
తనువుం గల్గినజీవి తప్ప కఘముం దాఁ జేయనాఁ గావఁ ద
త్తనువుం గూర్పకు నాకు నెప్డుఁ బరమాత్మా! దేవ! దీనావనా !

శా. మిత్రద్రోహ మొనర్పు చుంటిని గదా మిత్రాళికే మెక్కుచున్
గాత్రింబున్ మఱి పెం పొనర్పుచుఁ గడున్ గాపాడుచున్ నిత్యమున్
శత్రుద్రోహ మొనర్ప నాత్మవధకున్ శంకించి స్పష్టంబు నే
మిత్రద్రోహిని నుంతు వెందునక భూమిన్ దేవ! దీనావనా !

శా. దట్టం బై మొయి లంబరం బలమఁగా దావాగ్ని రేకెత్తఁగాఁ
బుట్టన్ ఝుంఝు వినూత్న తేజ మొదవన్ భూకంపముం గల్గఁగాఁ
బుట్టున్ భీతి య దేమవస్థయొకొ! తద్భూతోద్భవవ్యక్తి నే
యుట్టిం గట్టుక యూఁగఁ జూచు ధర నయ్యో! దేవ! దీనావనా!

మ. అతికాలంబు వసించి యుండుటను దేహాత్మాభిమానంబునన్
నెత లొందుం గద జీవి కల్లనిజముల్ వేర్వేఱు చేయంగ లే
"కతి సర్వత్ర విసర్జయే" త్తనిరి యార్యశ్రేష్ఠు లీచేటునే
మతి నూహించి విమోహ ముడ్పు పరమాత్మా! దేవ దీనావనా !

శా. "లోకో భిన్నరుచిః" అనన్ వినియు మూఢుల్ భేదవాదంబులన్
జీకాకుం బడి యన్యసమ్మతమతస్వీకారులం గాంచి యె
న్నో కాఱుల్ వచియింతు రీశర్మ నిశ వెంతో కూర్పుకొం చుంద్రు హా!
"యేకో దైవము విష్ణు" వంచెఱుఁగ రింతే దేవ! దీనావనా !

మ. మమకారాదుల మోహపాశములనున్ మాయాప్రపంచంబునన్
భ్రమ నంతర్బహిరింద్రియంబుల నపారావారసంసారమున్
బుమపత్యాద్యభిమానమున్ దనువుసొంపున్ బెంపు మానంబు జే
హము వ్యక్తిన్ దొలఁగింపఁ గర్మఁ జెనుపన్ హా! దేవ! దీనావనా !

శా. అన్నా! యంబర మేల లే దనఁగ నా కాయంబరం బుండఁగా
నన్నా! యేవిషయంబు లేల విషయవ్యాప్తంబు భాసిల్లఁగాఁ
ద్వన్నామంబు స్మరింప భాషణ మెలర్పన్ భూషణం బేల క
ర్మ న్నే నింకను ముగ్గఁ గాక పరమాత్మా! దేవ! దీనావనా !

శా. స్థానాస్థానము నిప్పు డప్పు డనకే సర్వత్రయున్ సర్వదా
నానాబ్రహ్మపిపీలికోరులవజన్మప్రాణిజాలన్ మృత్యువున్
హా! నాశంబుగ డాచి తీవ్రగతికర్మానంతరం బంగమున్
మానన్ నీకడ నొప్పు జీవి కృతకర్మన్ దేవ! దీనావనా !

శా. ఏదోసాకున నెందొ యెడ్డా మృతి తన్నిపంచభూతాప్పదం
బౌదేహంబున నుంచకే తొలఁచునం చత్యంతమున్ సేర్చియున్
హా! దర్పంబుఁ దొలంగు భీతిఁ గొను బాహ్యారిష్టమున్ బోయఁగ్రి
వ్యాదున్ జీఁకటిఁ గాష్టముం గని యనంతా! దేవ! దీనావనా !

శా. పంచప్రాకృతఘాతికాంగములతో బ్రహ్మాండభాండంబునన్
బంచాగ్న్యంతరులన్ నవగ్రహచరప్రాబల్యబద్ధాళులన్
గాంచి జ్ఞానులఁ జేసి పెట్టి కడు నగ్గింపన్, దలంపోయకే
పంచత్వంబు, నరుల్ చరింతురి బ్రిమ దేవా! దేవ! దీనావనా !

మ. దినముం దప్పక నిత్యకృత్యముల నీదేహంబుఁ దా లోకవృ
త్తిని శుభ్రిం బొనరింప కేమర వలంతిన్ మూర్ఖవన్ రానివా
సన కొట్టుం గద యక్కటంబునని సంసారంబొ లౌక్యంబొ పూ
ను నరుం డైహికమగ్నుఁ డౌ మఱచు నిన్నున్ దేవ! దీనావనా !

మ. ఎవిరయే సౌఖ్య మనిత్యసౌఖ్యమును నెంతేఁ బొందఁగా మానవుం
డవి మున్ జేసినపుణ్యకర్మఫలమే యన్ జ్ఞానమున్ గల్గి నిన్
మది సంస్థాపనఁ జేసి నిత్యసుఖసంప్రాప్తంబుఁ గాంక్షించి సా
గదమాంబున్ గొని చేయ కుండ వలెఁ గర్మన్ దేవ! దీనావనా !

శా. కాంతాకాంతులు నెచ్చెలుల్ ప్రియులు నింకన్ సోదరీసోదరుల్
సంతానంబులు తల్లిదండ్రులు గురుల్ సంబంధు లొండొండుగా
నంతం బందఁగ గర్మముక్తు లయి రం చామోదముం బొందకే
సంతాపించును బొక్కుఁ జిక్కు దురవస్థన్ దేవ! దీనావనా !

శా. నీ స్వాత్మన్ మననం బొనర్చను సదా నిశ్చింత వర్తింప న
న్నన్నా! త్రుంప షడూర్ములన్ గెడపివేయన్ క్షుత్పిపాసాదులన్
బన్నా లొంద నడంప నిశ్చలత నుచ్ఛ్వాసంబు నిశ్వాసమున్
మన్నె వాసము గా స్వబుద్ధికృతకర్మన్ దేవ! దీనావనా !

మ. మొదలేదో తుద యేదొ యించుకయునం బోల్పన్ గనన్ రాక యీ
న్నది కర్మానుభవోచితప్రకటజన్యప్రాకృతవ్యక్తికిన్
దదభీష్టం బొనఁ గూడు నెట్లు సకలాంతర్యామి నాద్యంతముల్
విదుకన్ లేనినినున్ భజింపకయ జ్ఞప్తిన్ దేవ! దీనావనా !

మ. మహి దృశ్యం బగుసర్వదేహములుఁ గర్మప్రాప్తముల్ గాఁగ నీ
యిహ చింతాభర మాను గాని సుఖదం బేరీతి నా నజ్ఞతన్
దహరాకాశమునన్ సమస్తము ననిత్యం బంచు రూపించకే
కుహనాశావికీర్ణవారిధి మునుంగున్ దేవ! దీనావనా !

మ. ఎది వీక్షించిన నేది కోరిన నహా! యే దేని భక్షించినన్
మదిఁ ద్వచ్ఛృష్టివిలాసచిత్రము లెబ్రహ్మత్వంబు పుట్టించి యీ
ట్టిదిగో నీదుమహాత్వ మన్ తలఁపు రెట్టించున్ జవుల్ మీఱి న
న్నది కోరిలం దరిఁ జేరఁ దీయ గదె దేవా! దేవ! దీనావనా !

శా. కేతన్నున్ శ్రుతజంబు వేసి ఘనకీర్తిన్ నీవు వారొంటినిన్
గోఁతన్ బెంటను వేసి వాలికులు సద్రూపంబు నావంటమున్
జేతోమోదముగా నొనర్తురిదియే చిత్రంబు దీనిన్ బుధ
వ్రాతం బెట్టులు సమ్మతించెదును దేవా! దేవ! దీనావనా !

శా. సౌందర్యంబునకున్ వశం బగును నీచప్రాంత, మీన్యక్తిఁ దా
ముందున్ వెనుకఁ బరీక్ష సేయమి: నగున్ భూరింబునున్, బేరిత మా
బొందిం బూడ్వఁగ నస్థిపంజరము, స్త్రీపుంభేదరాహిత్యమున్;
సౌందర్యం బెది? యాది నంతమున నీకా! దేవ! దీనావనా !

శా. బాడిన్ బూని ఘటాళిఁ జక్రి విలసద్వ్యాపారసర్లీలఁ దో
ర్లాఁడన్ జేసినభంగి మ ర్త్యతతి నీ వత్యంతలీలాగతిన్
బాడిన్ బూని యొనర్తు వంచు మది నే భావింతు తద్వ్యక్తమే
నా డం బైనఘటంపుటునికియును నన్నా! దేవ! దీనావనా!

మ. యశమో దుర్యశమో ధరన్ నిలుచుఁ గాయంబున్ బదార్థంబులున్
నశియించుం గద కాలకర్మవశతన్ నా కెందు కీకాయ మీ
యశవం బీరుహుడుపుల్ వదల్ సుతులు లోకాదుల్ ధ్రువంబున్ విప
ద్దశకే కర్మ గడించుకొంటక యనంతా! దేవ! దీనావనా!

మ. పశుపక్షిక్రిమికీటకాకృతులఁ బోల్పన్ జీవనంబుల్ నభో
దిశలన్ శూలుఁ బ్రతిక్షణంబును వలంతిన్ గర్మసాక్షిక్రియా
వశతన్ సృష్టిలఘుత్వచిత్రి మిదియే వ్యక్తివ్యతీహార మీ
దృశ దూరం బొనరించి మించు ఏను భ్రాంతిన్ దేవ! దీనావనా!

మ. అనయం బవ్యయ మైనజీవనమె లే యాకర్మసాక్షిక్రియన్
గనుఘ్మాలాక్షికి మాటి చంచలఘనోగ్రధ్వానయుక్తంబు లౌ
వనారూపంబులు గల్గ రోదసిని నల్లల్లాడి కాలచ్యుతం
బును బొందున్ వివిధప్రజంబుల సతంబున్ దేవ! దీనావనా!

మ. ఒనరున్ గా వివిధంబు లౌ వనిలసంయోగంబునన్ భూమి జీ
వనపద్రూపపదార్థ మయ్యది పృథగ్భావజ్ఞవిజ్ఞానులే
కనుగో నేర్తురు వట్టిగాలి యని పెక్కెం డ్రిజ్ఞులో దాని న
వ్యాథా నైకపదార్థ మందు రయో! దేవా! దేవ! దీనావనా!

శా. దేవత్వంబు నరత్వ మాది గల్యు త్రిత్వం బదే దైన మో
హావేశంబునఁదున్ మమత్వమునఁదున్ భావిప్రవృత్త్యాళికిన్
దా నై లో నయి నిత్యసౌఖ్యమును బొందం జాల దవ్యక్తునిన్
భావాతీతుని నిన్నుఁ గూడమిని దేవా! దేవ! దీనావనా!

మ. అఘురాహిత్యభవత్పదాంబుజమరందాస్వాదనేచ్ఛాద్వితీ
యఘునానూనవికారదుస్సహపిపాసాయత్తచిత్తున్ వనో
జ ఘనశ్రోణి మృగంబుఁ జేసి మృగతృష్ణన్ జేయకే డాయఁ జే
సి ఘటింపు నిరంతసౌఖ్యమును స్వస్తిన్ దేవ! దీనావనా!

శా. పుట్టన్ బిడ్డను నడ్డఁ బెట్టుకొని యామోదించు నత్యంతము
న్నిట్టన్ నెత్తిని మొత్తుకొం చడలుఁ చెంతేఁ గాంచుచున్ భీతమున్
గట్టా! యీవిపరీతవర్తనమునం గర్మిష్ఠి నిన్నాట్లీకన్
జెట్టాం బట్టు వెలుంగు మంగళకరశ్రీ దేవ! దీనావనా! 108.



## శ్రీకృష్ణార్పణమస్తు.

శా. ఊర్విన్ దంపతరక్తవీర్యములు గర్భోత్పత్తిగాఁ గేళిలో
సర్వాధీశ్వరులీలకారణమునన్ సంయోగమై యుండ మై
తర్వాతన్ దినమూనరీతిని వలంతన్ వృద్ధియై పిండమై
సర్వాంగంబుల నేనుమాసములకున్ సంధించి బ్రహ్మాండమై
సర్వానర్థపదార్థసంయుతము నాళ స్తవప్రపంచంబునన్
దుర్వారాపరితమానవేదనమయిన్ దుర్వాసనాంగంబులన్
సర్వాసహ్యానిగూఢమార్గముననే జన్మించి పెం పొంది యీ
యుర్విన్ వీడకుదాఁక దైన్యముననే యుంటన్ నిరూపించుచున్
సర్వుల్ స్వస్థితి నేర్చి సంతతమునున్ జ్ఞానప్రబోధంబునన్
సర్వాధీశు వరించి నిత్యసుఖమున్ సాధింపఁగా వ్రాసె నీ
మర్వన్ రానినుగమ్యపద్యములు సామర్థ్యావ్యయార్థీందుఁ డా
సర్వారాధకబుచ్చిరాజు భువి నాచంద్రార్కదీప్తంబు గాన్.

# తప్పొప్పుల పట్టిక.



| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 15 | పయిబిన్ | పయినన్ |
| 9 | 13 | బంటను | బంటయు |
| 9 | 13 | డనుచున్ | డనుచునున్ |
| 9 | 18 | జంగ్ఘాటం | జంజాటం |
| 10 | 11 | వర్ఛస్సే | వర్చస్సే |
| 11 | 8 | ఇంగాలంబె | అంగారంబె |
| 11 | 8 | సమవర్తి | నీళ దేవా |
| 11 | 15 | నౌనరు | యొనరు |
| 11 | 19 | విష్ణాశ్రీ | విష్ణ్వాశ్రీ |
| 13 | 15 | సర్వోత్కృష్టధోమార్గమున్ | యొంతో నీచమార్గంబునున్ |
| 14 | 8 | వంత బి | వంతం బి |
| 14 | 19 | బఱంగు | బరంగు |
| 15 | 17 | మాయప్రిబంచ | మాయాప్రిపంచ |
| 16 | 11 | కించిజ్ఞానుల | కించిద్ జ్ఞానుల |

# పామర్తి బుచ్చిరాజకవికృత గ్రంథరాజములు.

---

వెల తపాలకూలిగాక,

| | | |
|---|---|---|
| శ్రీసంగీతజగన్మోహినీనాటకము (పతివ్రతకథ) | రు | 0-12-0 |
| శ్రీకృష్ణనిర్యాణనాటిక (యాదవకులమునకుముసలము) | | 0- 8-0 |
| శ్రీసంగీతపద్మినీనాటకము (రాజపుత్రచరిత్ర) | | 0-10-0 |
| శ్రీజనార్దనశతకము (భక్తిరసము) | | 0- 2-0 |
| శ్రీదీనావనశతకము (వైరాగ్యనిదానము) | | 0- 2-6 |
| శ్రీవరపశుపుశతకము (నీతిప్రబోధము) | | 0- 2-6 |
| శ్రీశుకస్మృతి (పెంచినచిలుకపై పద్యములు) | | 0- 1-6 |
| శ్రీమాతృప్రేమ (తల్లికి బిడ్డపైఁగల అనురాగము) | | 0- 1-6 |
| శ్రీసుబోధిని (స్నేహలతాదేవిమృతికారణమున వ్రాసినది) | | 0- 1-0 |
| మధుఁడు ("దిమార్జ్ బోరస్టుబికింగ్" నకనుసరణము) | | 0- 4-0 |
| స్వర్ణస్పర్శనము ("గోల్డెన్టచ్" నకు నాంధ్రీకరణము) | | 0- 2-6 |
| అసూయ ("గోల్డెన్ ఏపిల్సు" నకు నాంధ్రీకరణము) | | 0- 2-0 |

పైవిలాసము:—

పామర్తి బుచ్చిరాజు, జగన్నాథపురము,

కాకినాడ.